శ్రీ ర స్తు.

ముద్దరాజు రామభద్రకవి విరచితం బగు



# క వి జ న సం జీ వ ని

(ల క్ష ణ గ్రం థ ము)



చె న్న పు రి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్ర క టి త ము.

1930.

# ఆంధ్ర గ్రంథములు.

ప్రతి 1-కి

మొల్లరామాయణము, చిన్నసైజు, పెద్దక్షరములు ...
రసికజనమనోభిరామము, కూచిమంచితిమ్మకవి ...
రంగనాథరామాయణము, ద్విపద, చక్కనిక్రొత్తకూర్పు ...
రంగరాయచరిత్రము, దిట్టకవి నారాయణకవి ప్రణీతము ...
రత్నపరీక్ష, సాంధ్రతాత్పర్యము ...
రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు ...
రాజయోగసారము, ద్విపద, తరికొండ వెంకమ్మది ...
రాజశేఖరవిలాసము, కూచిమంచి, తిమ్మకవి ...
రామరాజీయము, (నరపతివిజయము) చక్కనిప్రతి ...
రామాభ్యుదయము, అయ్యలరాజు రామభద్రకవి ...
రుక్మిణీకల్యాణము, సటీక, చక్కనిప్రతి (భాగవతము) ...
రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి, కూచిమంచితిమ్మకవి ...
రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము, మల్లనకవి ...
లంకావిజయము,(రావణదమ్మీయము) సటీక, పిండిప్రోలు లక్ష్మణకవి
వసుచరిత్ర, సటీక, రామరాజభూషణప్రణీతము అనేక
నూతనాంశములుగల చక్కనిక్రొత్తకూర్పు ...
వసుచరిత్రవిమర్శనము. శ్రీ చినసీతారామస్వామి శాస్త్రికృతము
అత్యద్భుతములగు క్రొత్తవిషయము లనేకము లిందుగలవు
వసిష్ఠజనకసంవాదము, యామిజాలశేషయ్యకవిది ...
వాసిష్ఠరామాయణము, ద్విపద, తరిగొండ వెంకమ్మది ...

శ్రీ ర స్తు.

ముద్దరాజు రామభద్రకవి విరచితం బగు

# విజనసంజీవని.

(లక్షణగ్రంథము)





చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1930.

# పీ ఠి క.

---

భాషాపోషకులారా!

తెలుఁగు బాసయందు లక్షణగ్రంథములు మిక్కుటముగఁ గలవని లక్షణగ్రంథనిర్మాతయగు "అప్పకవి" తన యప్పకవీయమునందలి ద్వితీయాశ్వాసంబున వ్రాసెను. అందుఁ గొన్ని యిప్పుడు మనకు మృగ్యములై యున్నవనుట తెల్లంబు. 'ముద్దరాజు రామన్న' యనునామాంతరము గల ముద్దరాజు రామభద్రకవీంద్రుఁడు "కవిజనసంజీవని" యను నీలక్షణ గ్రంథమును విరచించెను. దీనికే కవిలోకసంజీవని యనియుఁ గవిసంజీవని యనియు, నామాంతరములున్నట్టు కన్పట్టుచున్నవి. ముద్దరాజు రామభద్రకవి తండ్రి గణపయామాత్యుఁడు. ఇతని సోదరుఁడు పెదరామసచివుఁడు. వీరు నందవరీకనియోగబ్రాహ్మణులు. ఈకవీంద్రుఁడు తెనాలిరామకృష్ణకవి సమకాలికుఁడును, సులక్షణసార గ్రంథకర్తయునగు లింగమగుంట తిమ్మకవికాలమున ననఁగాఁ బదునాఱవశతాబ్దియం దున్నవాఁడు. ఈగ్రంథము మొదటషష్ఠ్యంతములు గురుస్తుతి మున్నగునవి లేవు. గ్రంథము సంపూర్ణముగ దొరకలేదు. దీనిని శ్రీ వావిళ్ల. వేంకటేశ్వరశాస్త్రులుగారు సంపాదించిరి. ఎందేని మఱియొక ప్రతి దొరకినచోఁ బునర్ముద్రణమునఁ జేర్ప

వచ్చునని దీనిని ముద్రించిరి. ఇందు యతిప్రాసప్రకరణము, శబ్దప్రకరణము, సమాసప్రకరణము, సంధిప్రకరణమునను నాలుగు ప్రకరణములు కలవు. ఇందుఁ బ్రాచీన ప్రయోగములు మిక్కుటముగఁ జూపఁబడెను. అఖండవడి యీమహాకవియంగీకరించి యుదాహరణములఁ జూపెను. ఎక్కువగ భారతము నుండియే లక్ష్యము లిందుఁగలవు. దీనిని జదివి 'యిట్టిసులభమగుశైలిగల లక్షణగ్రంథములు పూర్వకాలముననుండినవి గదా' యని తెలుఁగులోకమున సంతసింపని వారుండరు. తెలుఁగుభాషయందుఁ గల ప్రాచీన సద్గ్రంథముల ముద్రించి లోకమున కుపరించుచున్న బ్రహ్మశ్రీ వావిళ్ల. వేంకటేశ్వరశాస్త్రులు గారికి ధన్యవాదము లెల్ల రర్పింపవలసి యున్నది. శ్రీమన్మదనగోపాలకృపాకటాక్ష సంప్రాప్త సారసారస్వత సంపదానందుఁడగు నిమ్మహామహుని కృతిని "విద్వాన్, ఉభయభాషా ప్రవీణ" మున్నగు బిరుదముల నందఁగోరి సర్వకళాశాలల యందుఁ జదువువారు చదివి ప్రాచీన మర్యాదల నెఱుంగునట్లు విశ్వవిద్యాలయగ్రంథనిర్ణాయకసభ్యులు తమ సమావేశసమయంబుల నిర్ణయింతురు గాక!

కడప.
1-1-30.

పండితవశంవదుఁడు
కావ్యపురాణతీర్థ విద్వాన్,
జనమంచి వేంకట సుబ్రహ్మణ్యశర్మ.



శ్రీ ర స్తు.

శ్రీ రామాయ నమః.

# క వి జ న సం జీ వ ని

## ప్ర థ మ త రం గ ము.



మించుగ దనకాంతి వేఁడుటకు ల
క్ష్మీనామ సౌదామినీ
దామోపాయన మాచరించి భుజమ
ధ్యప్రాంగణా......
......గాఁ జెలంగులలిత
శ్రీవత్సముం బోల్చు రా
ధామోహాస్పద రూపధేయు మురళీ
ధౌరేయుఁ గీర్తించెదన్. 1

మ. తళుకుగ వజ్రము బంగరుంగరమునగ దాపించిన న్మించునీ
రలతాంతాయుధసంగరాంతరములో గాఢాంకపాళీరతిగ
గొలఁకుగ లాయపుముద్దుతేజిదొరతోఁగూడ న్మిటారించున
ప్పలుకుంజిల్కలకొల్కి నాదుమదిలో భావించి సేవించెదన్.

సీ. అందవతా నీకే మహాసుధానిధినిరా
ఘాటలాక్షణికతా కౌశలంబు
దొరయు నీకే కవిస్తోమస్తుతానేక
నాటకాలంక్రియా పాటవంబు
తగు నీకె శాబ్దిక స్తవనీయ భాష్యకై
యటముఖ్యశబ్దవిద్యానిరూఢి
చెల్లు నీకే లసజ్జేగీయమాన క
విత్వవై శారద్య విలసనంబు
తే. ననుచు బుధు లెల్ల వినుతింప నలరుముద్ద
రాజుగణపయ్య గర్భవారాశిపూర్ణ
చంద్ర పెదరామ పినరామ సచివమణుల
కనుఁగుఁదమ్ముఁడ రామభద్రాఖ్య కవిని. 3

క. ఒనరించెద నన్నయ తి
క్కనయజ్వప్రముఖ నిఖిలకవిసూక్తిమణీ
జని యగు "కవిజనసంజీ
వని" యనులక్షణము సుకవివరులు నుతింపన్. 4

లక్షణము.—

తే. ప్రాస మొనరింప బిందుపూర్వకముగాఁగఁ
గలుగఁ జెల్లు ధకార పకారములకు
సింధుమథనశిలోచ్చయ స్యందునకు ధు
రంధరపదంబు మామక గ్రంథ మనఁగ. 5

ఉదాహరణము (విరాటపర్వము).—

ఉ. "బాంధవశాస్త్ర వాకలిత భావభవావహ పాశబంధ సం
బంధ విరామకామ పరిపక్వ వివేకనిరూఢ భక్తహృ
ద్గ్రంధి విభేదనాపరమకారుణికాపరిమాణదూరదుగ
ఖేంధన........................" 6

వ. "గ్రంథ గ్రంథసందర్భే" అను ధాతువుమీఁద, "శాస్త్రద్రవి
ణయోర్గ్రంథః" అని అమరములో థాంతములలోఁ జెప్పఁ
బడినది గనుక గ్రంథశబ్దములోని థకారము వర్గద్వితీయ
వర్ణము. మంథవిలోడనే ధాతువు వికల్పమందు వర్గద్వితీ
యముగా ధాతుపాఠవ్యాఖ్యానము. 7

ఆముక్తమాల్యద.—

ఉ. కంథర నీలవర్ణ మధుకైటభ నాగ సుపర్ణ, యోగిహృ
ద్గ్రంథి బిలోత్థ భోగివనితాస్వన వచ్ఛ్వసన ప్రవ చ్ఛిర
స్సంధి వస న్నిశాకర రసస్రుతి దుగ్ధ పయోధి వీచికా
మంథర కేళికాదర సమాశ్రితపంక్తిశిరోధిసోదరా. 8

లక్షణము.—

తే. అర్ధబిందువు నిర్బిందు వగుపదంబు
ప్రాసముల దీర్ఘముల మీఁదఁ బలుకఁ జెల్లు
మూఁడు మూర్తులు నేకమై కూడె ననఁగ
స్తోఁకుమూఁకల నణఁచె నిష్ఠూకుఁ డనఁగ. 9

వ. అనంతుఁడు చెప్పినరీతి టపలమాత్రమే కాదు అన్నిం
టికిఁ జెప్పవచ్చును. 10

విరాటపర్వము. —

క. నాకొఱంత దీర్చి వచ్చితి
నీకొలఁదియె యింకను సూతునిం దెగఁజూడన్
లోకములు ముంపఁగం దగు
చీఁకటి యిది యెుదవె యేమి సేయుదు చెప్పుమా! 11

లక్షణము. —

తే. సంధి పూర్వంగఁ బ్రథమాంతశబ్దవితతి
పైఁ గచటతపలకు వికల్పంబు చెల్లు
కాకు సంబోధనావ్యయ కర్మధార
యంబుల నచేతనంబుల నబ్జనాభ! 12

సీ. నుతి సేయ ననఁగూడునె తలంప శక్యమా
యెుదఁ బాపదూర! నీపదయుగంబు
రచ్చియింతు నిన్ను గృష్ణ! చరాచరాది దే
వశరణసూక్తి నీ కసదృశముగ
నపరాధి నగుదు నేనపరాశ్రితుఁడఁ గావు
నఁ బవిత్రుఁ జేయు నన్ భువనవినుత!
మకరేంద్ర చకితుఁ దైనకరీంద్రుఁ బాలించి
న కృపానిధివి నీవు సకలనాథ!

తే. కోవిదులు నీదుపదభక్తి నావహిలినఁ
బాకశాసనుపద మైనఁ జేకొనంగఁ

గోరుదురె వారు నీహారశారదాభ్ర
చంద్ర నిభ కీర్తి! దేవతా చక్రవర్తి! 13

కాకు స్వరవికల్పము.—

క. నీచెప్పినపెద్దలు ద్రో
ణాచార్యులు మొదలుగాఁగ నని కొల్లనివా
రేచనువారలఁ గొని వే
యే చక్కం బెట్టువాఁడ నే పాండవులన్. 14

సంబోధన వికల్పము (కర్ణపర్వము).—

క. మాతండ్రి యంతచేసిన
పాతక మేకతముగాఁగఁ బాంచాలుని కృ
ష్ణా! తున్మెద నిన్ను నరుం
డే తేరకయున్నఁ బాఱ కీవు నిలిచినన్. 15

అవ్యయవికల్పము.—

మ. ధృతరాష్ట్రుండును బుత్త్రులున్ వనముకుంతీనందనుల్సింహము
న్మతినూహింప నసింహమైనవనమున్ మర్దింతు రెందున్ వనా
వృతవృత్తంబులుగానిసింహములకున్వేగంబ చేటొందుఁగా
న తగం బొందుట కార్య మీ యుభయమున్ సంతుష్టిమై
యున్కికిన్. 16

ఆదేశము వచ్చినందులకు (విరాటపర్వము-పద్యశేషము).—

మ. అవలీలన్ మనయర్జునద్విపము క్రోధావేశ దుర్దాంత ద

ర్ప విలా సోద్భట వృత్తి నేపడరి కౌరవాంబుజశ్రేణిఁ జి
క్కు-వడం జేయదె...... 17

కర్మధారయవికల్పము.—

చ. అకుటిలుఁడార్యసమ్మతుఁడహంకృతిదూరుఁడు నీతినిర్మలా
త్మకుఁ డనవంద్యశీలుఁడుసుధర్ముఁడుదాత్తుఁడుకుంతిముద్దునే
యుకొడుకు...................... 18

ఆదేశమువచ్చినందులకు (కర్ణపర్వము).—

చ. తెగి మన కర్ణమై యరుగు డెంచినవాఁ డితఁ డట్టురాక నొం
డు గడకుఁ బోవకుండఁగఁగదుఁ వెస డగ్గఱి నేఁగపాలముం
బగులుతునో గదానిహతి................ 19

అచేతనమునకు (ఆదేశము రానందునకు విరాటపర్వము).—

క. నాపతు లగుగంధర్వులు
చేపడి మృతి నొందె వింటె సింహబలుం డీ
పాపాత్ముని జూడుఁడు దు
ర్వ్యాపారఫలంబు గాదె యని పల్కు-టయున్. 20

ఆదేశమునకు.—

క. కావలియై సురరాజ్య
శ్రీ వాలింపంగఁ దగువిశేషంబున సం
భావితుఁడు.................... 21

లక్షణము.—

క. కవి యనుమతిఁ గృతిఁ జెల్లుఁ
పువుదీఁగన పువ్వుదీఁగ పొలుపుగ ననఁగా

దవు ద వ్వనంగ దానవ
నివహా వధూహారహరణనిపుణరథాంగా. 22

క. శ్రవణావతంస మయ్యెన్
ధవళాక్షిగుణంబు లపుడు ధరణీంద్రునకున్
శ్రవణావతంస మయ్యెన్
పువునింటి గుణంబులకును బుష్పాస్త్రునకున్. 23

ఉదాహరణము:—

ఉ. వే విన మేడపై వలభివేణిక జంట వహించి త్రిప్పఁగాఁ
బూవులు గోళ్ల మీటుతఱిఁ బోయెడుతేటుల మ్రోత....

లక్షణము.—

తే. సంస్కృతపదంబు గృతులఁ దత్సమము సేయు
నపుడు ముత్వంబగున్ దీర్ఘ మైనఁ జెల్లు
భానుకులుఁ డగ్లెఁ బరునిప్రాణాన కనఁగ
మానులు భజింతు రతని సౌఖ్యాన కనఁగ. 25

ఉద్యోగపర్వము, కందపద్యము.—

క. మానుగ ధృతరాష్ట్రుఁడు ప్రా
ణానం గలుగంగ బంధునాశము రాజ్య
శ్రీనాశము నుద్దామ య
శోనాశము నుడువ నేల చూచెదు చెపుమా? 26

గీతిశేషము.—

ఆ. వాడినారసములు వర్షుని నిటలాన
నాఁటనయ్యె మత్స్యనాథు సుతుఁడు.... 27

వరాహము.—

సీ. రమణులార ఫలాలు రాల్చినకీరపో
తముల ప్రాణాలకుఁ దప్పినారు.... 28

లక్షణము.—

క. లడయో రభేద మనఁగా
నిడదఁగు బ్రాసములు గృతుల నితరేతరముల్
దడము దలం బన మొసలి మొ
సడి వెడలె వెలలె ననఁగఁ జలరుహనాభా! 29

భీష్మపర్వము.—

క. కొడుకులు దమ్ములు గుఱ్ఱపు
దడములు పెక్కైన బలవితానము.... 30

నైషధము.—

చ. చిలుకలుగూయునో చెవులుచిల్లులువోవఁగ నంచు నెన్నడు
వెలలఁడు నందనోపవనవీధులకై యటుమాళిభాగని
ర్మల శశిరేఖ సేయు నపకారమునకా గజదైత్యనాశనుం
గొలువఁడు పాకశాసనునిఁ గోమలి నీదెస కూర్మి యెట్టిదో.

లక్షణము.—

తే. అమరుఁ గృతులందు నాంతపదములమీఁదఁ
గచటతపవర్గముల్ కూడి కదియఁ బలుకఁ
బిరుదనున్న నకారంబు బిందు వగును
కచటతప లెవ్వియైనను గజడదబలు. 32

లక్ష్యము.—

తే. అంగజగురుండు కరుణఁ గాచెం జగంబు
కంబుదళలోచనుండు బ్రోచుఁ జగంబు
అండజహయుండు దనుజపం క్తిం డిగిచెను
నని ప్రయోగింపఁ దగు కాళియాహిమథన! 33

తే. నందనందనుఁ డారగించెం దవంబు
నంబుజాక్షుండు మద మడఁచెం బలీంద్రు
తమ్మి యిమ్మగుకొమ్మదాల్చె న్మురారి
యనఁగ వర్తిల్లు నంబుదశ్యామ ధామ. 34

శృంగారషష్ఠము.—

శా. షండైనట్టి త్రిలింగభాగవత షష్ఠస్కంధ కావ్యంబు నీ
కుం డక్కెం జతురాననత్వ గుణయుక్తుల్.... 35

రాఘవపాండవీయము.—

స్రగ్ధరా. తల పెట్లుత్సాహ మొందం
దగుయజనపరిత్రాణ మర్థించి వేడ్కం
దళి తాపత్యాను రక్తిం.... 36

లక్షణము.—

క. కవి సమ్మతమై తగు ధ
ర్మవు ధర్మ మనంగఁ గర్మముఁ గర్మవు నా
దివిజులు వినుతింపఁగ ధ
ర్మవు బ్రోచెం గలుష మడఁచి మురహరుఁ డనఁగన్. 37

చ. అవని యరాజకం బయినయత్తఱి భూప్రజ లెల్ల సర్వక
ర్మవులు దొలంగ దేవ మునిముఖ్యులు. 38

శాంతిపర్వము.—

చ. ధర్మవున కొంకింతయుం దొలఁగఁ ద్రొక్కమి యంతయుదీన
మేలు గౌరవకులనాథ!... 39

లక్షణము.—

క. ఏ వాఁ డెవ్వాఁ డెవ్వఁడు
నా వర్తిలుఁ గృతులయందు నలినాక్షు గుణ
శ్రీ వరియింపఁగ సురలం
దే వాఁడు గలండు నా ఖగేశతురంగా. 40

శాంతిపర్వము.—

క. ఏవాని బంధుమిత్రులు
జీవధనంబులును నొప్పిఁ జెందుదురు.... 41

విరాటపర్వము.—

క. నీ వొకతె వేల యిలఁ బడి
వేవుర నే వెదకి పట్టి విడిచెద నడ్డం
బై వచ్చి వల దనఁగ నిం
దే వాఁడు గలండు నీవు నెఱుఁగవె కంటే 42

లక్షణము.—

క. నేతుర నేర్తు రనం దగు
దైతేయారాతి నీతి దైవతగుణముః

నేతు రె యఘుటన ఘుటనా
చాతురి నాసకల సుకవి జన సమ్మతిమై. 43

విరాటపర్వము.—

క. ద్యూతక్రీడకుఁగొండొక
నేతు రె కపటమున నొప్పని జనంబులు నా
చేతిబలువెల్లఁ గొని పరి
భూతి యొనర్చిన విరక్తి పుట్టి వెడలితిన్. 44

లక్షణము.—

క. పూంచెం బూనిచెఁ బూన్చెన
టంచుఁ బ్రయోగింపఁ జెల్లు నమరశ్రేణిన్
ముంచి మనోరథనికరము
పూంచె రమాధవుఁడు భక్తపోషకుఁ డనఁగన్. 45

విరాటపర్వము.—

క. కాంచన మాలాలంకృత
చంచత్తనులీల మెఱయ జవనాశ్వములన్
బూంచి యరదమున మణిమయ
పంచాననకేతు వెత్తె బంధురఫణితిన్. 46

వ. 'పెనిచితి, పెంచితి; మనిచితి, మంచితి; అనిచితి, అంచితి'
ఇట్లు ప్రయోగించునది. 47

ఉ. పెంచితి ధర్మమార్గములఁ బ్రీతి యొనర్చితి ధారుణీప్రజన్

మంచి తనేకయజ్ఞముల మానుగ దక్షిణ లిచ్చి విప్రులక్షా
మించితి.... 48

లక్షణము.—

క. చనుఁ దత్త్వవిధాయకసూ
త్ర నిమిత్తాగత ణకారరాజి నకారం
బునకుం బ్రాసము గానిడఁ
బ్రణుతు లొనర్చెద మురారి పదముల కనఁగన్. 49

అరణ్యపర్వము.—

క. త్రిణయనగోత్రస్పర్శం
బున నిజగాత్రము పవిత్రము.... 50

శృంగారషష్ఠము.—

క. విను మతిగుహ్యము నారా
యణకవచము భక్తవాంఛితార్థప్రదమున్.... 51

లక్షణము.—

క. యతుల వకారపవర్గ
ద్వితయాభేదంబు చెల్లుఁ బీతాంబరుఁ డా
యత బాహాబల జగద
ద్భుతుఁడై తునుమాడె దానవుల నెల్ల ననన్. 52

విరాటపర్వము పద్యశేషము.—

ఉ. పుట్టినసంశయంబు ననువుం బరికించియకాదె యింక ని
ట్టట్టనె యట్టునైన హృదయంబున.... 35

క. .........పాండవ
వరుఁడగుధర్మజున కిచ్చి బ్రదుకుము పుత్రా! 54

లక్షణము.—

తే. స్వాంత వేదండ మార్తాండ శబ్దములకు
యతులు నుభయంబు లగుబుధస్వాంతములకు
నతిశుభావహుఁ డెపుడు వే దండవరదుఁ
డనఁగ హరి దైత్యతిమిరమార్తాండుఁ డనఁగ. 55

వ. ఱుచ్చి స్వాంత ధ్వాంత యనెడుసూత్రనిపాతమై నప్పటి
కిని లింగాభట్టీయమందు భిన్నముగా వ్యాఖ్యానము చేసి
నందువలనను మహాకవిప్రయోగరీతిని హల్లులకుఁ బ్రయో
గములు కలవు. 56

విరాటపర్వము.—

ఉ. స్వాంతము బాహుగర్వఘన సంతమసంబు... 57

అచ్చులకు నైషధము.—

తే. అధిక రోషకషాయితస్వాంతుఁ డైన
నరపతికి విన్నవింపకు నాయవస్థ
పైత్య దోషోదయంబునఁ బరుసనైన
జిహ్వకును బంచదారయుఁ జేఁదు గాదె. 58

వేదండశబ్దమునకు.—

వ. "వేదస్సామవేదో అండో జననకారణం యస్యేతి వేదం
డః" అని యవయవవ్యుత్పత్తియై శకంధ్వాదివలెనే పర
రూపము వచ్చినది. 59

2

అచ్చులకు లక్ష్యము. ఆదిపర్వము (మత్తకోకిల శేషము.)—

..........వే,

దండదండ విదార ఘోరతరాశి యుక్త భుజార్గళా. 60

మార్తాండశబ్దము—

వ. హల్లుల కుదాహరణము. 61

ద్రోణపర్వము.—

చ. ధరణీచక్రము దిర్దిరం దిరిగె మార్తాండుండు కుంభీభవ

త్కిరణుండయ్యె.......... 62

అచ్చులకు.—

తే. అనుచు బుద్ధిగఁ దెలిపె మార్తాండసుతుఁడు... 63

వ. ఇట్లు అచ్చులకును హల్లులకుఁ బ్రయోగించునది. 64

లక్షణము.—

తే. చనుఁ బ్రయోగింప నొక్కఁ డెచ్చటను నాది

కవుల యనుమతి నచ్చ టక్కడ ననంగ

సుజనరక్షయొనర్చె నెచ్చటను జక్రి

కూర్మియే కొండ దాల్చె నొక్కఁడు ననంగ. 65

కర్ణపర్వము.—

......రారాజుసైన్యంబు లో

క్కమొగిం బెల్లగిలంగబిట్టడర సక్రోధారంతరంగంబులన్.

ద్రోణపర్వము.—

క. ......కొడు కె

చ్చటఁ బడియున్నాఁడో య

చ్చటుఁ జూపెడువాఁడు లేఁడెచూచెద వానిన్. 67

ఆముక్తమాల్యద.—

మ. స్ఫుటభూయోహ్వృతశంకవార్ధిరవిరశ్ముల మిన్నుఁ జేర్పం దటి
చ్ఛట లౌర్వంబుగఁ గ్రాలుకొంచు ఘనమై క్ష్మాదీఁ బవర్షింపన
చ్చటనుండోఁచి గ్రశింపఁబోలుఁ గలశీసూనుండు గాఁకున్న నో
క్కటఁ దారాగ్రహభాస్కరేందుమణిశుక్తుల్ వ్యక్తమై
తోఁచునే. 68

లక్షణము.—

క. ఏకృతులయందును నకా
రైకారంబులును వృద్ధివడి నిడఁ జెల్లుఁ గా
గాకోలధురంధర శిథి
లైక పరాక్రముఁడు హాలధరానుజుఁ డనఁగన్. 69

లక్ష్యము విరాటపర్వము.—

చ. ........................కభో
గైకపరాయణుల్ పురుషులం గజుఁ డప్రతికారచేష్టతన్. 70

భాస్కరరామాయణము.—

మ. ........................లో
కైకత్రాణుని రావణుం గనుము నీ కీబుద్ధి గాకుండినన్ 71

లక్షణము.—

క. డిగి దిగి యన నుభయమునగు
డిగి విడువక యపుడు కవ్వడిఁ బ్రోచుగతిన్
జగదవనపరాయణుఁ డై
దిగి విడువక మనుచు హరి సుధీతతి ననఁగన్. 72

ద్రోణపర్వము.—

చ. డిగుఁడిఁక వాహనంబులు కడిందిమగంటివిగోలుపోవ మీ
రు గడఁక దక్కి పెట్టకుఁడు రూపఱ నాయుధముల్....73

ఉద్యోగపర్వము.—

క. తగ నీలో నూహింపుము
దిగవిడువక ధర్మతనయు ధృఢమతివై పొం
దగుచందము కొడుకులకును
దిగ విడువక నాకు నిపుడు త్రిభువనచరితా! 74

లక్షణము.—

క. ఒనరఁగఁ బొనరఁగఁ యనఁగాఁ
బొనరింతు నొనర్తు ననఁగఁ బొలుచుం గృతులన్
వినుతులు శౌరి కొనర్తున్
బొనరింతు ననేక కావ్యములు హరి కనఁగన్. 75

ఉద్యోగపర్వము.—

క. ధనమును విద్యయు వంశం
బును దుర్మదులకు మదంబుఁ బొనరించును...... 76

మ. అనితన్ మెచ్చి వృకోదరుండితఁ డకార్యంబింత తెల్లంబుగాఁ
బొనరం బల్కెనొ యంచుఁ బేరెలుఁగుసొంపుం జెంది. 77

లక్ష్యము.—

క. అసమానసజ్ సమాసము
లసమంబుగ నచ్చు హల్లులకు యతి చెల్లున్

లసదుదరసరోరుహామధు
రస జలకేళీ ధురంధర మరాళహయా! 78

లక్ష్యము.—

ఉ. నీకరచక్రవిక్రమ మనేకపరక్షణ బద్ధకంకణం
బై కులిశాయుధ ద్విషదనంత దురంత నిశాటఝాటకాం
తాకుచపత్రభంగ రుచి నాస్తిక తా రచనాపరాయణం
బై కనుపట్టు సారబల నాస్తిక దూరకృపాపయోనిధీ. 79

ఆముక్తమాల్యద.—

...నిలిచినమాడ్కి-మాడుగు లనేకము లుల్లసిలుంబురంబునన్.

లక్షణము.—

క. నెఱయఁ గృతులందుఁ దగుఁ గొం
దొఱు నన జలధరముఁ జెందు తొలకరి జిగిడాల్
మెఱుపుల గతి యొనరుప నం
దఱు గొలువఁగ దనరు నా నుదాహరణంబుల్. 81

క. గిరిరిపు నెడ సేయు నెడ౯
బఱచు నెడ౯ బెనఁగు నెడ నపారబలంబు౯
మెఱయు నెడ భీమునకు నం
దొఱు గీడ్వడఁ దొడరి రుద్ధతుల్ రాజసుతున్.... 82

ఆరణ్యపర్వము (సీసపాదము)—

సీ. శూరులు ధృతరాష్ట్రసుతులు దుర్యోధనా
దులు దురాధర్షులం దొఱును మనకు.... 83

వ. "అందఱు, కొందఱు, అందొఱు, కొందొఱు" ఈరీతి ప్రయో
గించునది. 84

లక్షణము.—

క. వళు లమరు గణితరీతి హ
యలకును కారంబుదక్క నచ్చులతోడఁ
దెలుఁగున వా కుత్వోత్వం
బులు పదముల మొదట లేవు మునిజనవినుతా. 85

లక్ష్యము.—

సీ. యదువంశ జలరాశి హరిణ లాంఛనుఁడమ
రేంద్ర విభూతి విహితవిహారి
ఉత్తంస మత్తమయూరకలాపుఁ డ
నేకాసురవినాశ హేతుహేతి
హైమాచలేంద్ర ధైర్య దురంధరుఁడు మన్మ
థాద్ధత్యసాంతత్య యావనుండు
ఋషివాంఛిత ప్రదాయి కటాక్షుఁ డార్యస
మూహ నీపవనపయోధరంబు
తే. ననఁగ యతు లిడ నగుఁ గృతులందు మేలు
పొగడ శక్యండె దైత్యకాంతోరుపత్ర
హరణ నిపుణ రథాంగుఁడై సురల మనుప
నోపుటకుఁ జక్రి దక్క నన్యుం డనంగ. 86

ఆరణ్యపర్వము.—

ఉ. ఉన్నతి నీవు పూని బలియుం డగుదానవవర్యు రావణుం
బన్నఁగఁ జంపనోపుపటుబాహుబలాఢ్యవు.... 87

వ. అన్నిటికీచొప్పున గ్రహించునది. సులభము గనుక వ్రాయ
లేదు. 88

లక్షణము.——

మ. సుకవిస్తుత్యము గానఖండవడి నిల్చుఁ విశ్రుతంబై యొకా
నొకచోటఁ జలజాతజాతశతమన్యుల్ సన్నుతుల్సేయఁగా
సకలోర్వీవలయంబుఁ గాచుటకుఁ గంసాదిప్రమత్తాభియా
తికులంబెల్ల నడంచినాఁడు జితదైత్యేంద్రుండు పేంద్రుండనన్.

ఆరణ్యపర్వము.——

చ. ఉరమునయందుఁ గన్నులు పృథూదరదేశమునందు నోరు వి
స్ఫురితభుజద్వయంబు కులభూమిధరోదిత భావముం గరం
బరుదుగ నుగ్రమైనవికృతాకృతితోడ నశేషసర్వఘ
స్మరుఁ డగుచున్నయట్టి దివిజారిఁగబంధుని కాంచిరచ్చటన్.

ఉద్యోగపర్వము.——

చ. అని మది నిశ్చయించి తగ నత్తఱిఁ బిల్వఁగఁబంచి వారితో
ననిపిన మాటలాడి వినయంబునఁ బ్రార్థనఁ జేసి మీరు మా
కొనరిన సైన్యముల్ పదునొకొంటికిబ్రాభవమాచరింప....

రామాయణము.——

ఉ. అన్నవు తండ్రి యట్లు మది నారసినా రటమీఁద రాజులే
మన్నను దప్పుగాదునృపమండనముఖ్యము వైనకానుకల్
మున్నుగ సీత నిచ్చి జనలోకవిభు న్గని మమ్ము బ్రోవుమీ
సన్నపుకార్యముల్ వలదు సందియమే లటుగాక తక్కినన్.

లక్షణము.—

క. ఎగసెను నెగసె ననందగు
నెగసెఁ హరి దాల్చె దివిఖగేంద్రుం డనఁ బ
న్నగశాయి కేలఁ బూనఁగ
నెగసెం గంకం బోగి దివి నిన్నగమనఁగన్. 93

ఆదిపర్వము.—

ఆ. బంధనంబు లెల్లఁ బాయుచు భీముండు
నీటిలోననుండి నెగయుదెంచె... 94

ఉద్యోగపర్వము.—

క. ఎఱకలువిచ్చుచుఁదుండము
దెఱచుచు వేవేగ సొలసిద్రెళ్లె వివశుఁడై
యఱచిన నోడకు మని హరి
నెఱి చక్కఁగఁ ద్రోచి యెత్తె నెగయుఁ గృపతోన్. 95

లక్షణము.—

క. నిలయపరం బగుచో భా
సిలునత్వము సెయ్య యనఁగ సెజ్జ యనఁ దగుఁ.
జలజదళాక్షున కలరుం
జిలువలమన్నిని మేనిసెజ్జ యనంగన్. 96

ద్రోణపర్వము.—

సెజ్జయందు మేను చేర్చి యర్జునుకార్య
చింతఁ బలుకకుండి కొంతవడికి... 97

లక్షణము.—

క. చను నాపోశన వాతా
శన వాతాయనము లను వెసం గృతి రామా
యణము పరాయణ నారా
యణ నిత్యసమాసములకు యతులిరు దెఱంగై. 98

ఆపోశనశబ్దానకు శృంగారషష్ఠము.—

తే. భూసురుం డెత్తె నుత్తరాపోశనంబు... 99

వాతాయనశబ్దానకు విరాటపర్వము.—

సీ. తరుణులు పతులు వాతాయనంబుల నుల్ల
మలర వేపోకల మలయపవన... 100

రామాయణశబ్దానకుఁ గర్ణపర్వము.—

సీ. రథ్యచయంబు నారాయణ వానర
ధ్వజమునఁ బోలిచె... 101

నారాయణ పరాయణ శబ్దములకు కర్ణపర్వము..—

క. శ్రీయువతీప్రియ నృపనా
రాయణ బిరుదాంక భీమరమణీయ గుణ
శ్రీయుత నిర్మల ధర్మప
రాయణ రవితేజ రాజరాజనరేంద్రా! 102

ఏకాంతశబ్దానకు ఆరణ్యపర్వము.—

సీ....కామభోగముల కేకాంతగృహము... 103

జనార్దన శబ్దానకు (ఎఱ్ఱాప్రెగ్గడ.)—

చ. నగినగియేనియుర్వినుజనార్దన యెన్నఁడు బొంకుఁబల్కుమ
త్యగణిత విక్రమోరుబలధైర్యసమగ్రులము... 104

లక్షణము.—

క. అమరుం బోడిమి యనఁ బో
ణిమి యన నురువడియు నురువణించి యనంగాఁ
గమలావల్లభుఁ డఖిలా
నిమిషారులఁ దునిమె నురువణించి యనంగన్. 105

కర్ణపర్వము.—

తే. .........దానురువ
ణించెఁ గాకిఁ కేమి నృపవరేణ్య! 106

శాంతిపర్వము.—

చ. యజనముదానకర్మములునధ్యయనంబులుదస్యుహింసయుః
బ్రబ కనురాగమైనపరిపాలన సేఁతయు సంగరంబున
న్విజితవిభీతమైనురువణించుటయుఃనృపరాజధర్మముల్...

పోణిమికి రామాయణము ద్విపద, రంగనాథుఁడు.—

ద్వి. రాణివాస ద్రోహి రావణుఁ బట్టి
పోణిమి చెలుపవా బుధులు నుతింప. 108

రాఘవపాండవీయము రగడ.—

పోణిమిగ వకుళములు, పూగములు పూగములు
రాణ దనరారినపరాగముల రాగముల... 109

లక్షణము.—

ఉపసర్గల కుభయయతి చెల్లును.

హల్లులు చెల్లుటకు నైషధము.—

సీ. వితతనవద్వయద్వీప నానాజయ శ్రీవ
ధూటీ సమాశ్లిష్ట భుజుఁడు.... 110

అచ్చుహల్లులుచెల్లుటకుఁ బెద్దిరాజు అలంకారము.—

ఉ. ద్వీపులఁ జంపి విశ్వజగతీవరుఁ డుత్తమశక్తి జాంబవ
ద్ద్వీపమునందుగోపులకునిమ్ముగఁజేయుటయుఙ్ బ్రసిద్ధమై.

లక్షణము.—

క. డక్కెనని కాని చెల్లును
డక్కెననఁ బ్రయోగ మబ్జదళనేత్రునకుఙ్
జక్కెరవిల్తుని కేళిని
డక్కిరి పసిగాపు లెలమి దారు లనంగన్. 112

ఉద్యోగపర్వము.—

ఉ. డక్కెను రాజ్యమంచునకటాయిదిసోదర రాజ్యభాగము....

మనుచరిత్ర.—

...,డక్కఁగొనంగఁగా దెయకటా వనువీఁడుపరిగ్రహించినన్

లక్షణము.—

క. తెనుగున ఋకార రేఫల
కును భేదముఁగాఁగ యతులకును బ్రజవనితా
జనతాశయహారి విహా
రిని శౌరిని బొగడె దేవఋషభుం డనఁగాన్. 115

సభాపర్వము.—

సీ. ఋత్విజుం డని విచారించిపూజించితే
ద్వైపాయనుండుండ ధర్మవృత్తి... 116

లక్షణము.—

తే. తాయెతయు నుయ్యెలయుఁ బయ్యెదయునుదక్క
గలుగ దెత్వంబు మధ్యయకారములకు

తుదను గ్రియదక్క నెత్వంబు గదియ దాది
నత్వ మొందదు తెనుఁగుల నజ్జనాభ. 117

తాయెతునకులక్ష్యము-చంద్రభానుచరిత్రము (సీసపాదము).—

సీ. ఒకయింతరొమ్ముఱఁగిన సికమీఁద ముడిపువ్వు
ఱెత్తులు మెఱయఁ దాయెతులు చుట్టి. ...118

ఉయ్యాలకు ఆరణ్యపర్వము.—

...ఉ, య్యాలయునుబోలెనూరకయ యెంతయుప్రొద్దు
వినిశ్చితాత్ముఁడై. 119

పయ్యెదకు ఆరణ్యపర్వము, యయాతిచరిత్రము సూరపరాజు.—

సీ. వలఁబడ్డ జక్కవల్ వలె నున్న జిలుఁగుప
య్యెదలోని గుబ్బపాలిండ్లు మెఱయ.... 120

లక్షణము.—

క. గురునకు గురునికి ననఁగా
ధరఁ బూర్వకవీంద్రసమ్మతమ్ములచేతన్
బురుషోత్తమ యొక్కొకచో
నరుఁడగుఁ జెలికాఁడు కృష్ణునకు ననిపలుకన్. 121

ఉద్యోగపర్వము.—

క. సకలభువనములు నఱచే
తికిఁ దేరంజాలు నట్టిధీమంతుఁడు దే
వకికొడుకు గలఁడు ధర్మజు
నికి యాతండెత్తిరాక నిలుచునె చెపుమా. 122

క. వివిధ మణిమయ రథంబులు
జవనాశ్వంబులును భద్రసామజములు ర
త్నవివిధభూషణ దాసీ
నివహంబులు బాలకృష్ణునికి నేనిత్తున్. 123

గద్య. ఇది శ్రీమన్మదనగోపాల కృపాకటాక్షప్రాప్త సారస్వత సంపదానంద నందవరకులాలంకార ముద్దరాజు గణపయామాత్యపుత్ర పెదరామసచివసోదర రామభద్ర ప్రణీతంబైన కవిజనసంజీవని యనులక్షణగ్రంథమందు యతిపద్ధతి యను ప్రథమతరంగము.

శ్రీ కృష్ణార్పణమ్.



శ్రీ ర స్తు.

# క వి జ న స ం జీ వ ని

## ద్వి తీ య త ర ం గ ము.



తే. ద్విత్వము విసర్గలోపంబు వెలయుచోటఁ
జను నుకారాంతశబ్దంబు తెనుఁగు సేయ
రఘు రఘువు బాహు బాహువు రాహు రాహు
వూరు వూరనమఱి మేరు మేరు వనఁగ. 1

రఘుశబ్దానకు ఆదిపర్వము.—

మ. ...ధ, ర్మజు నాభాగు భగీరథుం భరతునిఁ మాంధాతృ
రాముఁ రఘున్. 2

బాహుశబ్దానకు విరాటపర్వము.—

తే. అగ్గలించి నాయెదుట బా హప్పళించి
కడవఁ జాలినమల్లులఁ గాన నెందు... 3

రాహుశబ్దానకు శల్యపర్వము.—

క. ఉర్వీచక్రము వడఁకెను
పర్వము లేకయును రాహు భానునిఁ బట్టెన్... 4

ఊరుశబ్దానకు.—

శా. ...మో, కా లూరుల్ కనుదమ్ములుఁ మెదడు చక్కం
ద్రొక్కనిల్చుఁ నగున్. 5

మేరుశబ్దానకు పాండురంగమాహాత్మ్యము.—

శా. మీఁదంధారధరాధరంబుగలయామేరుక్షనగంజాలి... 6

లక్షణము.—

క. పులకము లలకము లనఁగాఁ
బులక లనంగాఁ దరంగములు నాఁగఁ దరం
గలు తరఁగల నఁగ హంసం
బులు హంసలు నాఁగఁ గృతులఁ బొలుచు ముకుందా! 7

పులకలు ప్రయోగము ఆముక్తమాల్యద.—

ఉ. మేలవలిన్ననల్ నిగుడమేఁబులకల్ వొడుమక్ష్లథాంగయై
సోలినఁజూచి...... 8

అలక లనుటకు ఆరణ్యపర్వము.—

సీ. వదనంబుతెంపు భావనచేత మరుపడ
నుదుటిసొం పలకలఁ బొదువఁ బడఁగ... 9

తరఁగ లనుటకు రాయనిభాస్కరుఁడు.—

శా. జ్యాఘోషంబు నిరంతరం బగుచుమ్రోయక్షబెల్లుదంభోళి
ధా, రాఘోరాస్త్రపరంపరల్ తరఁగలై రంజిల్ల.... 10

తే. కలశవారాశిలో దరఁగలమలుంగు... 11

హంసము లనుటకు కర్ణపర్వము.—

సీ. అనుటయు కాక మిట్లను హంసములతోడ
గతులు...... 12

హంస లనుటకు.—

క. దమయంతికి నలునకు సం
గమకారణ దూత యైనకలహంస మనో
జ్ఞ మనుష్యవాక్యముల నా.... 13

కర్ణపర్వము.—

క. కలశాలి యైన హంసముఁ
బిలిచితిఁ బురణించి పాఱఁ బెలుచ ధనమునన్
గలవే యింతకుమును హం
సలలోఁ బురణించు వాయసంబులు జగతిన్. 14

లక్షణము.—

క. పరఁగును గొన్నిటఁ దిర్య
క్పర మైనపదంబు పురుషపదవాచక మై
యురగులు సముద్రుఁ డనఁగా
నురగములు సముద్రమనఁ బయోజదళాక్షా! 15

ఆదిపర్వము.—

చ. అరిది తపోవిభూతి నమరాగుల బాధలఁ బొందకుండఁగా
నురగుల నెల్లఁ గాచినమహోరగనాయకుఁడు... 16

లక్షణము.—

క. చను కన్ను చన్ను మొదలుగ
నొనఁ గూర్చ హలాదితోడ నూదఁగఁ జెల్లున్
చనుఁగవ చన్నుంగవ యన
కనుఁగవ కన్నుఁగవ యనఁగఁ గమలారమణా!. 17

వసంతవిలాసము.—

శా. శ్రీచన్నుంగవ క్రేవ క్రొమ్మెఱుంగులన్.... 18

కన్నుఁగవ అనుటకు.—

కన్నుఁగవ శల్యుఁ జూచిన యున్న యునికి... 19

లక్షణము.—

క. చరితము చరిత్ర మొకయెడ
బరఁగున్ స్త్రీలింగరీతి పద్మాక్ష భవ
చ్చరిత జగన్నుత మన నీ
చరిత్ర శక్రాదిదివిజ సంసేవ్య మనన్. 20

ఆదిపర్వము.—

ఆ. ధరఁ బ్రజాకరంబు దయతోడ సర్వధ
ర్మాభిరక్ష బెంచి యమలచరిత
మీవె రాజ్యవిభవ మిదియేల యని తప
శ్చరణ నునికి నీకె చనియె ననఘ! 21

చరిత్రకు అందునసే.—

చ. ...పాండవో
త్తములచరిత్ర నాకు సతతంబువినంగ నభీష్ట మయ్యెడిన్.22

లక్షణము.—

క. కృతిని నుమాగమములు ద
క్క తకారాంతంబులుం దగన్ దేలఁగ వి
స్తృత మగు హరి మనిచెఁ బరి
క్షితు నన సౌమిత్రి యింద్రజిత్ గెలిచె ననన్. 23

ఆదిపర్వము.—

ఉ. జనకుఁ బరిక్షితుణ్ భుజగజాల్ముఁ డసహ్యవిషోగ్రధూమకే
తనయుతుఁ జేసి... 24

లక్షణము.—

క. కలిగి యనుచోట నిడఁ దగుఁ
దెలుఁగున నై యనుపదంబు దితిజాహితుఁ డు
జ్జ్వలదివిషన్నికరకుతూ
హల మగుశంఖంబు చక్రమై తగుననఁగన్. 25

విరాటపర్వము.—

క. అరుణాశ్వంబులఁ బూనిన
యరదంబున వెడదనిడుపు లగుచేతులు బం
ధురకంధరంబు వెడలుపు
టురమునునై ద్రోణుఁడొప్పె నుత్తరకంటే. 26

ద్రోణపర్వము.—

సీ. తెల్లనిగొడుగులుణ్ దెల్లసీవిరులునై
యల్లవాఁడే పాండవాగ్రజుండు... 27

శాంతిపర్వము.—

సీ. అప్సరోనికరుంబ మాటలు పాటలు
నై వినోదింపఁగ నమరగణము... 28

లక్షణము.—

తే. ఏకవచనంబె కేలున కిరుల కెల్ల
బహువచనమె తగు మురారి బాణుకేలు

తుని మె నని యమ్మహాత్ము భక్తులు భజింతు
రిరు లడఁచు సూర్యు కైవడి దురిత మనఁగ. 29

ఆముక్తమాల్యద.—

మ. తళుకొత్తున్ భుజకీర్తి వజ్రఘృణిసూత్ర స్యూత హారస్ఫుర
త్కళికా చిత్రకుచద్వయోపరిగళాధస్స్వల్ప విస్తార దై
ర్ఘ్యలసత్తిర్యగురస్తటంబను వివాహించ న్మనోజాత పా
టల దంతచ్ఛద బోడబాసికపుదండల్ వోలె కేళ్లింతికిన్. 30

లక్షణము.—

తే. పంచమీవిభక్తిపట్టున మధ్యన
కారలోప మగు వికల్పముగను
విష్ణుభక్తుఁ డొకఁడు జిష్ణునికంటెను
గలఁడె వేల్పు కృష్ణుకంటె ననఁగ. 31

కర్ణపర్వము.—

సీ. ధాత్రిమై దాకి క్రూరతఁ బోరి మగటిమిఁ
బాసిన యంగారపర్ణుమీఁద
ఘోషయాత్రావిధి కురురాజు చెఱఁబట్టి
మాన మీఁగిన చిత్రసేనుకంటె... 32

లక్షణము.—

క. పలుకఁగఁ జెల్లు విశేషణ
ములు మఱి షష్ఠికిని బ్రథమముల్ సురలందున్
గలరా భువనంబున దో
హలబాహుబలుండు నీరజాతుని కనఁగన్. 33

భీష్మపర్వము.—

క. అపరాహ్ణా సమయమందున
నుపమాతీతాది ఘోరయుద్ధం బయ్యెన్
విపుల భుజబలుఁడు భీమున
కపరిమితబలుండు కౌరవాధీశునకున్. 34

లక్షణము.—

క. తెనుగు కృతస్త్రీలింగం
బునకు విశేషణము పున్నపుంసకము లచే
తనమునఁ జెల్లె యశోదా
తనయుఁ గృపాదృష్టి సౌఖ్యదాయక మనఁగన్. 35

సభాపర్వము.—

క. వరుణసభ సర్వలోకో
త్తర ముజ్జ్వలమయము నతిసితప్రభ మతిసుం
దర మందుండును వరుణుఁడు
వరుణానీసహితుఁడై ధ్రువంబుగ నెమ్మిన్. 36

లక్షణము.—

క. తెలిఁగింపఁగ బహువచనం
బుల కైనను నేకవచనము విశేషణమై
నిలుచుం బ్రాసపదంబులు
వెలిగా హరికీర్తితములు విఖ్యాత మనన్. 37

ఆదిపర్వము.—

మాలిని. సురపతిసభఁ జూడఁ జూడ నంగారవృష్టుల్

గురిసెఁ గులిశధారల్ కుంఠితం బయ్యె దిక్కుల్... 38

లక్షణము.—

క. దూతపదము స్త్రీలింగము

రీతిఁ బ్రవర్తిల్లు సకలకృతులఁ బరఁగుటన్

దూత యగుచుఁ బాండుతనూ

జాతులకు హితం బొనర్చె శౌరి యనంగన్. 39

ఆరణ్యపర్వము.—

సీ. నిత్యసత్యవ్రత నిషధేశ నీవు మా

కరయంగ దూతవై యభిమతంబు...... 40

లక్షణము —

ఆ. ధూర్తముఖ్యపదచతుష్టయం బగు నుత్వ

మేని దుత్వమేని గృష్ణువలన

ధూర్తనీచు మూర్ఖుఁ ద్రుంచెను గృష్ణుండు

చేసె రాజ్య ముగ్రసేనుఁ డనఁగ. 41

విరాటపర్వము.—

క. అన నప్పలుకుల కయ్యం

గన కోపము వీడి నీచు గావున జంకిం

చినగాని మెత్త విడిపోఁ

దని మనమునఁ దలఁచి వాని కపు డిట్లనియెన్. 42

వ. ఈ ప్రకారము "ధూర్త మూర్ఖ" అని ప్రయోగములు. 43

వృద్ధశబ్దమునకు ఆరణ్యాపర్వము.—

క. ...జ్ఞానము
గలదేనియు బాలుఁడైనఁగడువృద్ధుచుమీ. 44

గద్య. ఇది శ్రీమన్మదనగోపాల కృపాకటాక్ష సంప్రాప్తసారస్వత సంపదానంద నందవరకులాలంకార ముద్దరాజు గణపయామాత్యపుత్ర పెదరామసచివసోదర వైనందిసాదార్యచర్యాభిరంజితసముద్ర రామభద్ర ప్రణీతంబైన కవిజనసంజీవని యనులక్షణగ్రంథంబునందు విభక్తిపద్ధతి యనుద్వితీయ తరంగము.

శ్రీ కృష్ణార్పణమ్.

శ్రీ ర స్తు.

# క వి జ న సం జీ వ ని

## తృ తీ య త రం గ ము.



తే. చెల్లుఁ దిర్యక్పదము లెల్ల శ్రేష్ఠశబ్ద
సంయుతము లైనపురుషవాచకము లట్లు
పన్నగేంద్రుఁడు మృగరాజు పతగనాథుఁ
డనఁగ నశ్వోత్తముఁ డనంగ నబ్జనాభ. 1

సౌప్తికపర్వము.—

ఉ. అగ్గురునందనుండు హరిణావళిఁ గాంచి కుభృత్తటంబునన్
డిగ్గుమృగేంద్రుచాడ్పునఁగడిందిమగంటిమి యుల్లసిల్లఁగన్
డిగ్గిరథంబుక్రోధివడినిం గలయున్... 2

ఆదిపర్వము.—

మ. అవధారాంబుజఫేనపుంజనిభునయ్యశ్వోత్తమున్ దవ్వులన్.

లక్షణము.—

క. పడెఁ బఱచెఁ బెట్టెఁ బాటన
నిడఁదగు సంస్కృతముతుద మదేభము మొసలిం
గడుభంగపెట్టె సంకట
పడె నాకులపఱచె దుఃఖపాటొనరించెన్ 4

ఉద్యోగపర్వము.—

క. ప్రియ భయ శబ్దంబులు బిం
దుయుతంబుగ నిల్పఁదగు యతుల్ గృష్ణశుభో
దయులు ప్రియం బడరి దుర
త్యయ శౌర్యులు దానవుల్ భయంపడి యనఁగన్. 5

ఆరణ్యపర్వము (పద్యశేషము).—

ఉ. ......వచ్చెఁబ్రియంపడి కుండలంబులున్. 6

ఆదిపర్వము.—

చ. ...హరి హరి యంచు డుండుభమహాహిభయంపడిపల్కె-
భార్గవున్. 7

లక్షణము.—

క. తెలుఁగుల నైదాఅక్షర
ములపై సంస్కృతపదంబు పొసఁగింపఁ దగున్
గలిమిచెలిచెలిమి విభునకుఁ
వెలసిరి పదియాఱువేల ప్రియులు ననంగన్. 8

కర్ణపర్వము.—

తే. దాఁకినప్పుడు మీఱుదంతావళములు... 9

తే. అనఘ యిరువదివేలు దివ్యాబ్దములుమ
హాతపం బొనరించె నయ్యసురవాణి... 10

ఆముక్తమాల్యద.—

మ. పులుఁగున్ దాపినవోదనంబు... 11

మనుచరిత్రము.—

సీ. కటికచీఁకటితిండికరముల గిలిగింత
నెవ్వాఁడు తొలఁగకన్నె... 12

లక్షణము.—

తగు స్త్రీలింగము తెలిఁగిం
పఁగ నెంతసమాసమధ్యమంబున నైన
న్నగధరులీలాభవనము
లగణితకాళిందితటవనావళు లనఁగన్. 13

రాఘవపాండవీయము.—

క. నెలకొనియె వేడితమి న
బ్బలియుఁడు శిశిరనగరుచిర పరిసరమహిమన్
గల తమసతీరసికతా
విలసనములు డెందమునకు విందొనరించెన్. 14

గద్య. ఇది శ్రీమన్మదన గోపాలకృపాకటాక్షప్రాప్తసారసార
స్వతసంపదానంద నందవరకులాలంకార ముద్దరాజు గణప
యామాత్యపుత్ర పెదరామసచివసోదరరామభద్రప్రణీతం
బైనకవిజనసంజీవని యనులక్షణగ్రంథమందు సమాసపద్ధతి
యనుతృతీయతరంగము.

శ్రీ కృష్ణార్పణమ్.

శ్రీ ర స్తు.

# క వి జ న సం జీ వ ని

## చతుర్థతరంగము



క. మిన్నగ నకారహల్లుల
కున్న చ్చులతోడ సంధిఁ గూర్పఁగఁ జెల్లున్
పన్నగశయనుఁడు హరి యో
ర్చు న్నఘములు భక్తులైన సుజనుల కనఁగన్. 1

ఆరణ్యపర్వము.—

చ. వరదుఁడు పార్థు శౌర్యవిభవంబున కాతనిధైర్యయుక్తిని
న్నరుదుగ మెచ్చి సన్నిహితుఁ డయ్యె జటామకుటేందురే
ఖయున్,గరమున శూలమున్ సరళనీలగళంబు బృహద్గజా
జినాం,బరము తృతీయలోచనముపన్నగహారములొప్పుచుం
డఁగన్. 2

లక్షణము.—

తే. అచ్చుపై నచ్చుసమము సేయంగఁ జెల్లు
సకలశుభములు శౌరిభూజనుల కనఁగ
నతని నుతియించు భక్తులెం తధికమనఁగ
కిను కుడుగఁ గంసు నడఁగించెఁ గృష్ణుఁ డనఁగ. 3

విరాటపర్వము.—

క. జన్నములు సేయునెడఁ బ
క్వాన్నంబులు గుడుచుచుండు మధిపతి నిన్నున్
జన్నియ విడిచనె నిత్తఱి
మిన్నక కినుకుడిగి పొమ్ము మీగృహమునకున్. 4

లక్షణము.—

క. క్రియతుద నగు రేఫలు పొ
ల్లయినన్ గృతిఁ జెల్లు యాదవాధిపుఁ దలఁతున్
నియతవ్రతు లనఁగ ధనం
జయముఖ్యులు గొలుతు రతనిచరణము లనఁగన్. 5

భారతము.—

క. అప్పరుసునఁ బెనఁగెడునృపు
లిప్పుడు భారతరణోర్వి కిరవై తలఁపుల్
గుప్పలు గొనఁబడి రనికిన్
దప్పినవాఁ డొకఁ డొకండు ధరణిపుచేతన్. 6

ఆముక్తమాల్యద.—

తే. కాద్రవేయులు భూమిని గ్రైకొనంగ
సురగలోకంబు వెడలి తత్పరిఘనీట
నెగసి తోడనె గ్రుంకుదు ర్నిలువలేక
తత్తటీబద్ధ గారుత్మతముల కులికి. 7

శాంతిపర్వము.—

మ. పరిహాసంబునఁ దేలిభృత్యులయెడ న్బ్రహ్లాదమున్బొందుభూ
వరునాజ్ఞం జని రేని మెచ్చరతనిన్ వంచింతురేగాక చో
త్తురుగా తూహల వేషభాషణములందుల్యత్వముం బొందనే
ర్తురు తా రెల్లపదంబు వేఁడుదురు భృత్యుల్ భూమి
మాటొడ్డుచున్. 8

గద్య. ఇది శ్రీమన్మదన గోపాలకృపాకటాక్షప్రాప్తసారసార
స్వతసంపదానంద నందవరకులాలంకార ముద్దరాజు గణప
యామాత్యపుత్ర పెదరామసచివసోదరరామభద్రప్రణీతం
బైనకవిజనసంజీవని యనులక్షణగ్రంథమందు సంధిపద్ధతి
యనుచతుర్థతరంగము సర్వము సంపూర్ణము.

శ్రీ కృష్ణార్పణమ్.

చెన్నపురి : శ్రీ 'రామ' ప్రెస్సున ముద్రితము:—1930.

# ఆంధ్రగ్రంథములు.

## పద్యకావ్యము.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అచ్చతెనుఁగురామాయణము, శుద్ధప్రతి | ... | 1 | 4 |
| అడవిమల్లెలు, ఎనమండ్ర నారాయణమూర్తిగారిది | ... | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము, క్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము | ... | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తి అబ్బయామాత్యప్రణీతము | ... | 0 | 8 |
| అప్పకవీయము, శ్రీగిడుగు రామమూర్తి పంతులుగారి విపుర్శతో నున్నది | ... | 2 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతము) | ... | 0 | 4 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాసముతో మేలుకాగితములమీఁద చక్కఁగ నరల ముద్రింపబడినది. | ... | 3 | 0 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 2 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది | ... | 5 | 8 |
| డిటో అత్యుత్తమప్రతి, రెండుసంపుటములు | ... | 7 | 8 |
| డిటో 3 సంపుటములు | ... | 9 | 0 |
| ఆంధ్రభాషాభూషణము | ... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము, అట్టబైండు | ... | 0 | 12 |
| ,, ... కాలికోబైండు | ... | 1 | 2 |

శ్రీమదాంధ్రభారతము-పద్యకావ్యము:—

అనేకవ్రాతప్రతుల సహాయమున చిరకాలమునుండి సంపూర్ణ పరిశ్రమముతోఁ బరిష్కరింపఁబడినది. మేలుకాగితములపై స్ఫుటముగ అచ్చొత్తించి మంచికాలికోబైండు చేయఁబడియున్నది.

| | | | |
|---|---|---|---|
| 7 సంపుటముల ప్రతి | ... | 14 | 0 |
| 3 సంపుటముల ప్రతి | ... | 13 | 0 |
| ఆది సభాపర్వములుగల సంపుటము | ... | 2 | 0 |
| ఆరణ్యపర్వము ,, | ... | 2 | 0 |
| విరాటోద్యోగపర్వములు ,, | ... | 2 | 0 |
| భీష్మద్రోణపర్వములు ,, | ... | 2 | 0 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు ,, | ... | 2 | 0 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక స్వర్గారోహణపర్వములుగల సంపుటము | ... | 2 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 5 | 8 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | ... | 3 | 12 |
| శాంతిసప్తము ,, | ... | 3 | 12 |
| ఆదిపర్వముమాత్రము, పెద్దచ్చు, చిన్నసైజు | ... | 1 | 8 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రిది | | 0 | 8 |
| ఆనందరంగరాట్ఛందను, కాలికోబైండు | ... | 1 | 8 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము, కావ్యస్మృతితీర్థ జనమంచి శేషాద్రిశర్మకృతము, 3 సంపుటములు | ... | 12 | 0 |
| డిటో 7 సంపుటములు | ... | 14 | 0 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు- టీకానుక్రమణికాసహితము, కాలికో | ... | 1 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 0 | 8 |

| | రూ. | అ. |
|---|---|---|
| ప్రతి 1-కి | రూ. | అ. |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము, చక్కనికూర్పు, గిల్టుబైండు ... | 2 | 0 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము ... | 1 | 8 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవిది ... | 0 | 6 |
| కవికర్ణరసాయనము (మాంధాతచరిత్ర) కాలికో ... | 1 | 8 |
| కళాపూర్ణోదయము, దళసరికాగితములు ... | 2 | 4 |
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు ... | 1 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) ... | 0 | 4 |
| డిటో గట్టుప్రభుకృతము ... | 0 | 6 |
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము ... | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు ... | 0 | 6 |
| గద్యపద్యసంగ్రహము ... | 0 | 10 |
| గరుడాచలము, యక్షగానము, పెద్దచ్చు ... | 0 | 2 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైనపద్యము, కవనము మిక్కిలిసొంపు; పీఠిక అతివిపులము ... | 7 | 8 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు, ప్రథమభాగము ... | 1 | 4 |
| డిటో రెండవభాగము, సాధారణప్రతి ... | 1 | 6 |
| డిటో మేలుప్రతి, గ్లేజు కాగితములది ... | 1 | 10 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము ... | 1 | 2 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము ... | 1 | 0 |
| తెనుఁగుసమస్యలు ... | 0 | 2 |
| దశకుమారచరిత్రము, పద్యకావ్యము, కేతనకవికృతము ... | 1 | 8 |
| దశావతారచరిత్ర, నూతనముద్రితము ... | 2 | 0 |
| దసరాపద్యములు ... | 0 | 2 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| నరసభూపాలీయము, కాలికోబైండు | ... | 1 | 0 |
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు | ... | 0 | 6 |
| నలచరిత్ర, ద్విపద | ... | 0 | 14 |
| నిర్వచనోత్తరరామాయణము, మేలుప్రతి | ... | 1 | 0 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము | ... | 0 | 6 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | ... | 0 | 4 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము, కాలికో | | 0 | 8 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రెగ్గడ, క్రొత్తకూర్పు | ... | 1 | 0 |
| పంచతంత్రము, నారాయణకవికృతము | ... | 0 | 12 |
| డిటో వేంకటనాథరాజకవికృతము | ... | 1 | 4 |
| ప్రబంధరత్నావళి | ... | 1 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు | ... | 0 | 10 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు, క్రొత్తకూర్పు | ... | 0 | 8 |
| బసవపురాణము, పిడుపర్తి సోమనాథప్రణీతము | ... | 2 | 4 |
| బ్రహ్మోత్తరఖండము, శ్రీధరమల్లెవేంకటరామకవి | ... | 1 | 0 |
| భాస్కరరామాయణము, చక్కనిక్రొత్తకూర్పు | ... | 4 | 0 |
| భోగినీదండకము, బమ్మెరపోతనకవి | ... | 0 | 1 |
| భోజరాజీయము, అనంతామాత్యకృతము | ... | 1 | 2 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారివ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీద స్ఫుటమైన అక్షరములతో చక్కఁగ ముద్రించియున్నారము. | ... | 2 | 0 |
| మార్కండేయపురాణము, మారనకృతము | ... | 1 | 12 |
| మూన్నాళ్లముచ్చట, వేటూరిప్రభాకరశాస్త్రి | ... | 0 | 4 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.